# ముక్తికాంతా విలాసము




mohan PUBLICATIONS

ఆధ్యాత్మిక గ్రంథ నిలయం

మోహన్ పబ్లికేషన్స్

కోటగుమ్మం, అజంతా హోటల్ ఎదుట,

రాజమహేంద్రవరం - 533101.

శ్రీరస్తు.

# ముక్తికాంతావిలాసము.







ఇది

ఆచంటపురసముద్భవుండగు

శ్రీగవరాజు సూర్యనారాయణశర్మచే

రచియింపఁబడి

పెద్దాపురమునందలి
శ్రీజగపతి ముద్రణాలయంబున
ముద్రింపఁబడినది.

1918

# ఉపోద్ఘాతము



శ్లో. అనిత్యాని శరీరాణి, విభవోనైవశాశ్వతః
నిత్యంసన్నిహితోమృత్యుఃకర్తవ్యోధర్మసంగ్రహః

అనునట్లు లోకంబున సకలజన్మములలోను శ్రేష్ఠమైనది మానుషజన్మము. అట్టి యుత్తమజన్మ లభించినందుకు దేహాదు లనిత్యమని, ఐశ్వర్యంబు లశాశ్వతమని, భోగములు నిరర్థకమని, మృత్యువు సత్యమని నిశ్చయించి. జన్మసాఫల్యమైన మోక్షధర్మమును శీఘ్రముగా గ్రహించవలసినదని జ్ఞానశాస్త్రము బోధించుచున్నది. గనుక యీమానవజన్మములో తానేమి సంపాదింపవలసినదో, తా నేమి అనుభవించవలసినదో, తానే విచారించిన సూక్ష్మములోనే మోక్షమని ఒక్కయుక్తిలోనే ముక్తియని తన్ను తా నెరిగిన తానే బ్రహ్మమని అట్టి బ్రహ్మానందమే తానను భవించవలసిన దని తనకే తెలియబడుచున్నది. అది యట్లంటే—

ప్రశ్న. మోక్ష మనగా యెటువంటిది ?

ఉ. జీవుడు దేవు డగుటయే మోక్షము.

ప్ర. జీవు డెట్టివాడు ? దేవు డెట్టివాడు ?

ఉ. తన్ను తా నెరుగక తల్లడించువాడే జీవుడు. తన్ను తా నెరిగి సుఖించువాడే దేవుడు.

ప్ర. జీవు డెక్కడనున్నాడు? దేవుడెక్కడనున్నాడు?

ఉ. దేవుడే జీవుడై దేహములో నున్నాడు గాని దేవునికంటె జీవుడు వేరుగా లేడు.

ప్ర. దేవుడే జీవుడైనయెడల తన్ను తానెందు కెరుగడు?

ఉ. దేహేంద్రియాదులతో గలసి దేహము తా నని భ్రమించుచున్నాడు.

ప్ర. అట్లైన జీవుడు దేవు డెట్లగును?

ఉ. తన స్వరూపము తా నెరిగిన జీవుడు దేవుడే అయియున్నాడు.

ప్ర. తన స్వరూపము తా నెరుగుట యెట్లు?

ఉ. తనశరీరములో నేనని పలుకుచున్న వస్తువును తానని గ్రహించుటయే తన్ను తా నెరుగుట.

ప్ర. ఈ దేహేంద్రియాదులలో నేననేవస్తువు యేది?

ఉ. తెలివిరూపమై సర్వమును గ్రహించుచున్న దే ఆత్మవస్తువు.

ప్ర. తెలివనగా యెటువంటిది?

ఉ. ప్రజ్ఞానమని, ప్రత్యగాత్మని, చైతన్యమని,

ఎరుకని, తెలివని పర్యాయనామములు గాని అకల్పిత స్వయం వ్యక్తమైన పరబ్రహ్మవస్తు వొక్కటియే తెలివిరూపమై సర్వదేహములలోను ప్రకాశించుచున్నది.

ప్ర. అట్టి పరబ్రహ్మమునకు అజ్ఞానజీవభ్రాంతి యెట్లు వచ్చినది ?

అనాదిమూల ప్రకృతివలన బ్రహ్మమందు జీవభ్రాంతి కల్పితమగుచున్నదిగాని జ్ఞానాజ్ఞానములు రెండును బ్రహ్మమందు లేవు. గనుక బ్రహ్మము తానని యెరిగిన తానే దేవుడని తాత్పర్యము.

శ్రీరస్తు.

శ్రీగురుభ్యోనమః

# ముక్తికాంతావిలాసము.



## మొదటిభాగము

### స్వస్వరూపస్వయంబోధిని

శ్లో. వందేగురూణాం చరణారవిందే సందర్శితస్వాత్మ
సుఖావబోధే. జనస్యయేజాంగలికాయమానే
సంసారహాలహలమోహశాంత్యై.

అనగా లోకములోని మాయాకల్పితశరీరధారులకు దారాపుత్ర సంసారసంబంధమువలన స్వస్వరూపవిస్మ

తగలిగి తాపత్రయాగ్నిచే జన్మమృత్యు భయాక్రాంతముసంభవించుచుండును. అట్టిసంసారదవానలమునే పరమగురుని, నిజబోధవలన నివర్తించి స్వస్వరూపమైన పరమాత్మదర్శింపబడుచున్నదో అట్టిపరమగురుని పాదారవిందములకనేకవందనములు సభక్తిపూర్వకముగా నమస్కరించి ఆత్మబోధ ప్రకటింపబడుచున్నదనితాత్పర్యము.

శ్లో. స్వయంవ్యక్తం, స్వయంవ్యాప్తం, స్వయంజ్యోతి
స్వయంప్రభ, స్వయంసంవిత్, స్వయంపూర్ణం
సచ్చిదానందమద్వయం.

అనగా యీనామరూపప్రపంచమునకు అధిష్టానమైన ఆదిపరబ్రహ్మము సృష్టికిపూర్వమే అకల్పితస్వయంజ్యోతియై సూర్యునివలెప్రకాశింపుచు సముద్రమువలె పరిపూర్ణమై పర్వతమువలె నిశ్చలమై తానేమియు నెరుగకుండుటవలన బ్రహ్మమనగా నిష్క్రియోగికమనీ అద్వితీయమనీ అమాయకమనీ సచ్చిదానందమనీ సృష్టిమందు పేర్కొనబడుచున్నదిగాని బ్రహ్మమునందు నామరూపగుణపకారములు లేవని తాత్పర్యము.

శ్లో. అహంశక్తిరహంవృత్తిరహంప్రకృతిరహంస్మృతిః
అహంకర్తాఅహంభోక్తా, అస్తిభాతిప్రియంత్వయం

అనగా అఖండసచ్చిదానందపరబ్రహ్మమునందు అనాదిమూలప్రకృతియైన బ్రహ్మశక్తి అహంస్ఫూర్తి రూపమైజనించి సర్వజగత్తును సృజించి దేహరూపమై కర్తృత్వభోక్తృత్వంబులు కల్పించుటవలన నిర్వికారుండైన ఆత్మకు ప్రకృతివికారంబు లారోపితములై జన్మమృత్యు జీవభ్రాంతి సంభవించుచున్నదని తాత్పర్యము.

శ్లో. ఇదంవిశ్వమిదందృశ్యాం, స్వాత్మమాయాస్వకల్పితం.
నామరూపాత్మకంసర్వాం, నాస్తి భాతిప్రియంసదా

అనగా యీదేహాదిప్రపంచముసర్వము యింద్రజాలమువలెనే సచ్చిదానందబ్రహ్మమైన తనయందు సంకల్పశక్తియైనమాయచే జనించిఉన్న బ్రహ్మమును లేనట్లున్నూ లేనిప్రపంచ మున్నట్లున్నూ, తోపించుచున్నది గనుక అస్తి భాతి, ప్రియరూపమైన ఆత్మయే సచ్చిదానంద బ్రహ్మమనిన్నీ అన్యతజడదుఃఖస్వరూపమైన ప్రకృతియే బ్రహ్మశక్తియనిన్నీ నామరూపప్రపంచమే మిథ్యాభూతమనిన్నీ తాత్పర్యము.

శ్లో. అహంస్ఫూర్తి స్స్వయఙ్ఞప్తి ప్రకృతిపురుషమయంజగత్
అహంజీవస్స్వయంబ్రహ్మఅహంస్ఫూర్తిలయంస్వయం

అనగా అఖండవ్యక్తియైన బ్రహ్మమే స్వయం

వ్యక్తమైన పురుషుడనిన్నీ, అహంవృత్తియైన మనస్సే బ్రహ్మశక్తియైన ప్రకృతియనిన్నీ, వృత్తిజ్ఞప్తులైన ప్రకృతిపురుషులే జీవబ్రహ్మలనిన్నీ, ప్రకృతిపురుషాత్మకమైన జగత్తే మాయాకల్పితమనిన్నీ, నిశ్చయించి అహంవృత్తియైన తనమూలప్రకృతిని అఖండవ్యక్తియైన తనయందు లయింపజేసి స్వయంబ్రహ్మము తానై స్వస్వరూపమందు క్రీడించుటయే మోక్షసామ్రాజ్యపట్టాభిషేకమని తాత్పర్యము.

శ్లో. హృదాకాశోదితోహ్యాత్మా, బోధభానుస్తమోపహృతు। సర్వవ్యాపి సర్వధారి భాతిసర్వంప్రకాశితే.

వ్యాఖ్యానము. ఏవంశోధితః ప్రత్యగాత్మా, బ్రహ్మాంతఃకరణావృత్తౌ, ప్రతిబింబితః, స్వస్వాశ్రియతమోరూపాజ్ఞాన ముపసంహారణ్, భానురివ, సర్వస్వరూపప్రకాశితేత్యర్థః.

తాత్పర్యము. స్వస్వరూపమనగా యీదేహస్తమైన ప్రత్యగాత్మ కేవలజ్ఞానస్వరూపియగుటవలన సూర్యునివలె స్వయంప్రకాశమై తానుదహరాకాశమందుదయించి అంతఃకరణవృత్తులయందు భానునివలె ప్రతిఫలించి ఆత్మయందు ఆవరణవిక్షేపరూపమై ఆవరించిన అజ్ఞానాంధకారమును జ్ఞానదీపమునివ ర్తించి సర్వాధి

ష్ఠానమైన స్వస్వరూపమును తనంతటతానే ప్రకాశింప చేయుటవలన ముముక్షువులకు ఆత్మబోధ సూర్యుని వలె ప్రకాశింప మూలాజ్ఞానము నివర్తించుచున్న దని తాత్పర్యము.

"తస్యాత్మా కేనవా ప్రకారేణ సర్వవ్యాపక ఇత్యతిజానీయా దిత్యాశంక్యాహ సాక్షాద్వక్తుమశక్యత్వాత్ అనణ్వస్థూల మిత్యాదిశ్రుత్యా అసన్నిరసనద్వారా। నిషేధాదిహే తుభూతం సన్మాత్రం బ్రహ్మైవ జానీయాదిత్యాహ"

అనగా లోకంబున ఎవ్వనికైనా తనయాత్మ యొక్కటే సర్వత్రా వ్యాపించి సర్వమును ప్రకాశింప జేయుచున్నదని యేసాధనముచేత తనకు తెలియబడు చున్నదని విచారించిన, అవాఙ్మానసగోచరమైన పర మాత్మను ఇట్టిదట్టిదని చెప్పుటకలుగనందున అణు వు గాదని, మహత్తుగాదని, అణువు కంటె ర్యాయియని మహత్తు కతితమని శ్రుతిజెప్పినట్లు అనత్యమైన దేహేం ద్రియాదులనన్నిటిని తానుసత్తామాత్రమై గ్రహింపు చు ఇది నేనుగాదు ఇదినేను గాదని సర్వమును తానే నిషేధించి అధిష్ఠానము తానై సాక్షిమాత్రముగా శే షించునదియే బ్రహ్మస్వరూపముగా ఆత్మవేత్తలు తె లుసుకొనుచున్నా రని తాత్పర్యము.

" మనుష్యేషుశతకోటి సంఖ్యాకేషు, యఃకశ్చిత్ యీ శ్వరప్రసాదపాత్రీభూత ఏవంకూటస్థానంగచిద్రూపం ఆత్మానం అద్వయం అఖండానందైకరసం పశ్యతిస ఆశ్చర్యవదేవభవతి; యథాహనుమతః సముద్రోల్లంఘన మాశ్చర్యంతద్వత్ అతిదుస్తరవిషయాశాపాశం నిర్ద ళ్యామోక్షేచ్ఛాకారణమాశ్చర్యం. మోక్షేచ్ఛా యాః అతిదుర్లభత్వాత్, బహుజన్మాభ్యాసత్వాత్, బహుపుణ్యపరిపాకసాధ్యాత్వాత్, చిత్తప్రసాదైక మూలత్వాచ్చ సంతీర్ణాశేష, విషయాశాసింధుః శుద్ధా త్మామోక్షైకకామో ముముక్షుః అతిదుర్లభః ఇత్యర్థః

అనగా లోకంబునమనుష్యకోటిలో నూరుకోట్ల కొకానొకడు పరమేశ్వరానుగ్రహపాత్రుండై అఖండా నందరసంబైన ఆత్మనుదర్శించుట మహాదుర్ఘటము. అదియెట్లంటే అతిపరాక్రమశాలియైన ఆంజనేయులు అలంఘ్యమైన మహాసముద్రమును అవలీలగా దాటిన ట్లు జన్మమృత్యుసంసారబద్ధుండైనజీవుండు సర్వలోక విషయభోగవిరక్తుండై ఆశాపిశాచంబైన కామపాశ ముఖండించి నిష్కామత్వంబున మోక్షకామియగు టయె దుర్లభ్యము. మోక్షేచ్ఛయనగా అనేకజన్మము లందుయీశ్వరోపాసనాదిసత్కర్మలనుజేయుటవలననూ

అనేక పుణ్యఫలములచే మనఃపరిపాకము నొందుట వలననూ,సర్వలోకభోగసంతుష్టుండై సకలవిషయాశా సముద్రమునులంఘించిపరిశుద్ధచిత్తుండై అత్యాతురము ముక్షుండగుటయె మహాద్భుతమైనదని తాత్పర్యము.

"బ్రహ్మసత్యం జగన్మిథ్యేతినిశ్చయపూర్వకం బ్రహ్మైవాహమితి పరోక్షజ్ఞాన సముత్పన్నంస్యాత్; అతజ్ఞాన నిష్ఠాసిద్ధేః మహద్వైరాగ్యం తీవ్రమోక్షేచ్ఛా తత్పరత్వంచ ఏతత్త్రితయమేవకారణం; తథాపి ఇంద్రియనిగ్రహాభావేవైరాగ్యాది జ్ఞాననిష్ఠాచనసిధ్యతి. అతఃసాధకస్యయత్నతఃఇంద్రియజయస్సంపాద్యః."

అనగా సాధనచతుష్టయ సంపన్నుండైనముముక్షువునకు నిత్యానిత్యవివేకమువలన సర్వదృశ్యప్రపంచముమిథ్యాభూతమనియు,సర్వాధిష్ఠానపరబ్రహ్మముతాననియు, పరోక్షజ్ఞానముజనించిననూ అపరోక్షబ్రహ్మసాక్షాత్కారమునకు దృఢవైరాగ్యము, అత్యాతుర ముముక్షత్వము, ఉత్తమశ్రద్ధ యీమూడును ముఖ్యసాధనమైనను. ఇంద్రియనిగ్రహములేకుండిన వైరాగ్యబోధోపరతులు సిద్ధింపవుగనుక అభ్యాసితగు ప్రయత్నముచే యింద్రియనిగ్రహమును ముందుగానభ్యసించవలెనని తాత్పర్యము.

"ఇంద్రియాణాం విషయాభిముఖేనపురు
షాకర్షణసామర్థ్యేపి, స్వరూపానుసంధా
నేచ్ఛయా, సర్వేంద్రియాణితిరస్కృత్య
ఆత్మానుసంధానేన పరివర్తమానత్వం
ధీరత్వమిత్యర్థః.

అనగా బ్రహ్మనిష్ఠుండు తనమానసేంద్రియం బులు తన్ను వశపరచుకొని విషయబద్ధునిజేయుచున్నవని గ్రహించి ప్రతిబంధములైన దేహేంద్రియాదులను బ్రహ్మనిష్ఠాబలంబున జయించి ఆత్మానక్తచిత్తుండై నిరంతరబ్రహ్మనిష్ఠచే బ్రహ్మానందసుఖం బనుభవించవలెనని తాత్పర్యము.

"నిత్యానిత్యవివేక వైరాగ్యాభ్యాం, తీవ్రముముక్షుతయాచ, సర్వంసన్యస్య యేముముక్షువః శ్రవణంకుర్వంతి తేషాంముక్తిః సమ్యగ్జ్ఞానేనవినా, నసిధ్యతి; సమ్యగ్జ్ఞానంచసమాధింవినానసిధ్యతి సమాధిశ్చ ఇంద్రియనిగ్రహంవినా, నసిధ్యతి, ఇంద్రియనిగ్రహోపి నిశ్శేషరాగాదిత్యాగంవినా, నసిధ్యతి;"

అనగా యేముముక్షువులు ఆత్మానాత్మవివేక ఇహాముత్రార్థఫలభోగ విరాగశమాది షట్కసంపన్నులై, వేదాంతశ్రవణముచేయుదురో అట్టిపూర్ణాధి

కారులకు ఆరూఢజ్ఞానమువలనగాని జీవన్ముక్తి సిద్ధింప దు. అట్టిదృఢజ్ఞానము నిశ్చలసమాధివలనగాని లభింపదు. అట్టి నిర్వికల్పసమాధి యింద్రియనిగ్రహము వలనగాని పొందబడదు. సర్వవస్తువిషయానురాగము ను విడువకగాని యింద్రియజయము నశముగానేరదు. గనుక బ్రహ్మనిష్ఠుండు నిరంతరాభ్యాసబలంబున సర్వ వాసనాక్షయ మనోలయంబుగావించి బ్రహ్మసాక్షా త్కారమునుపొందవలెనని తాత్పర్యము.

"జన్మానేకశత సహస్రకృతసుకృతపరిపాకేన, కృత్యాచార్య ఈశ్వరప్రసాద సౌష్కల్యం ప్రాప్తవతో, యస్యసమాధినా సర్వమిదమహంచ బ్రహ్మైవేతి బ్రహ్మపరోక్షవిజ్ఞానం అప్రతిబద్ధంభవతి; తస్య మహాత్మనః స్థితప్రజ్ఞస్య ప్రబుద్ధస్య స్వప్నవ్యహారవత్ అహంమమేదమిత్యా దివ్యవహారోవినివర్తతే; నిద్రావత్ అవిద్యాయా వినష్టత్వాత్ తత్కార్యస్యాపినిశ్శేషనివృత్తిః; అతఃప్రబుద్ధోజాగరఇవజీవన్ముక్తో బ్రహ్మవిత్ బ్రహ్మన్యేవఆరమతి."

అనగా అనేకకోట్లజన్మములందు చేయబడిన పుణ్యఫలమువలన ఈశ్వరానుగ్రహబలంబున ఎవనికి సద్గురుకటాక్షలబ్ధంబగు నిశ్చలసమాధియందు సర్వప్రి

పంచమున్ను బ్రహ్మస్వరూపమే యనిన్నీ ఆబ్రహ్మ ముతనస్వరూపమేయనిన్నీ స్వానుభవజ్ఞానము దృఢనిశ్చయమగుచున్నదో అట్టిబ్రహ్మజ్ఞుడు అఖండపరిజ్ఞా వంతుడై నందున నిద్రమేల్కొన్నవానికి స్వప్నవ్యాపారము మిథ్యాభూతమైనట్లు దేహము తానసెడిఅహంకారమును, యింద్రియంబులు తనవియనెడి మమకారంబును, అవిద్యాకార్యమంతయు స్వప్నతుల్యమైనివర్తించుచున్నది. గనుక బ్రహ్మవిదుడు జీవన్ముక్తుడై మహాజాగ్రతనుబొంది బ్రహ్మమైనతనయందు తానేరమించుచుండునని తాత్పర్యము.

"స్వతఃసిద్ధేనిత్యకూటస్థానంగ చిద్రూపే చక్షుషారూపవత్ సర్వత్రఉపలభ్యమాన ఆనందైకరసాత్మని స్వస్వరూపేక్రీడన్ రమమాణో బ్రహ్మవిత్ ఆత్మనాస్వస్వరూపేణైవతుష్టః, స్వాత్మానందరసానుభూత్యైవసంతోషం తృప్తించప్రాప్య అమృతరసపాయీలవణాంబువత్ తుచ్ఛంవిషయసుఖం.నాపేక్షతే.

అనగా బ్రహ్మనిష్ఠుండు స్వయంవ్యక్తమై, నిత్యమై, కూటస్థమై, అవంగమై, చిద్రూపమై ప్రకాశించుచున్న తన ప్రత్యగాత్మను నేత్రముచే రూప

మునుచూచునట్లు విజ్ఞానదృష్టిచే నంతటనుదర్శింపుచు తన స్వరూపమందు తానేరమింపుచు బ్రహ్మమయుఁడై విహరింపుచు తనయందుతానే పరితృప్తినొందుటవలన అట్టివాడు తుచ్ఛమైనవిషయభోగముల నపేక్షింపడని తాత్పర్యము.

"యథావివేకీ సూక్ష్మబుధ్యాతరంగ ఫేన
బుద్బుదాద్యమ్మయంసర్వం జలామాత్రం
పశ్యతి; యథాకటక మకుటాదిహైమం
సర్వం హేమమాత్రంపశ్యతి; తథాప్రత్యక్
స్పష్ట్యాస్వంచ జగత్సర్వంచ బ్రహ్మమాత్రం
పశ్యతి; నఏవలద్వైతదర్శీ అవిద్యాబం
ధవిముక్తశ్చతస్యమహాత్మనః సిద్ధస్య
సుప్తోస్థితవత్ స్వాతిరిక్తమపశ్యతః
పూర్ణవృత్తేః బ్రహ్మవిద్వరిష్టస్య లోకప్రవృత్తి
ర్నసంభవతి."

అనగా లోకంబున వివేకవంతుండు సూక్ష్మబుద్ధివలన సముద్రతరంగ బుద్బుదంబుల నన్నిటిని జలమయముగాను మకరకుండలకిరీటాదుల నన్నిటిని స్వర్ణమయముగాను గ్రహించునట్లు ముముక్షుండైన జీవుండు విజ్ఞానదృష్టివలన తానున్నూ జగత్తున్నూ బ్రహ్మ

మయముగా గ్రహించుటయె అద్వయితసిద్ధి యనబడు చున్నది. అట్టి అద్వయబ్రహ్మమునకు అజ్ఞానప్రతిబంధము నివర్తించుటవలన నిద్రించువాని కన్యములోచనట్లు అంతఃకరణవృత్తికి బ్రహ్మమైన తనకంటె అన్యమేమియును తోచనందున బ్రహ్మజ్ఞానులకు దేహము తాననే యహంవృత్తి కలుగనేరదని తాత్పర్యము.

‹‹జపాకుసుమసాన్నిధ్యాత్ స్ఫటికేరక్తిమవత్
అనాత్మసాన్నిధ్యాత్ ఆత్మనిప్రతీయమానాని
అనాత్మకర్తృకాణి సర్వాణ్ప్రకృతిరేవకరోతి
నాహంకరోమీతి అధ్యాత్మవిద్యయా
స్వయంబ్రహ్మభావమాపద్య విద్వాంతిష్ఠత్.››

అనగా లోకంబున శ్వేతవర్ణమైన శుద్ధస్ఫటికమువద్ద రక్తవర్ణమైన రత్నపుష్పములుంచినస్ఫటికము రత్నముగా తోచునట్లు అసంగచిద్రూపమైన ఆత్మకు అనాత్మసంబంధమైన ప్రకృతివికారంబులు ఆరోపింపబడుచున్నవి గనుక ఆత్మమైన తాను ప్రకృతికంటె వేరగుటవలన కారణకార్య కర్తృత్వంబులు మాయాకృత్యంబులుగానీ ఆత్మకృత్యంబులు గావని నిశ్చయించి బ్రహ్మవిద్యాప్రభావమువలన సర్వసాక్షియై సాక్షియానుభూతిం జెందువాడే సర్వజ్ఞుడని తాత్పర్యము.

"యథాకన్యకా, స్వయంబుతుమతీభూత్వా
స్వజనం త్యక్త్వాభర్తారమేకమాశ్రిత్య,
తదేకాలంబనాభూత్వా, తత్రైవరమతే
తేనైవ తుష్యతి, హృష్యతి, ఆనందతి,
నాన్యంశృణోతి, పశ్యతి, స్మరతి, స్పృశతి,
స్వయం పతివ్రతాభూత్వాతత్రైవతిష్ఠతి;
తద్వైవ యస్యబ్రహ్మ విదుషోపరిజ్ఞానమా
ధినా ప్రౌఢీభూయదేహం, ప్రాణం, ఇంద్రియ
జాతంచ, సర్వందూరతః పరిత్యజ్య, సచ్చిదా
నందైకరసం పరంబ్రహ్మైకమేవ మాశ్రిత్య,
తదేకాలంబనాభూత్వా, తత్రైవరమంతి,
క్రీడంతి, నందంతి, దుష్యంతి, హృష్యంతి,
సతీపతివ్రతావత్, నాన్యంశృణోతి, పశ్యతి,
ధునుతే, విజానాతి, స్వయంసదా తదాత్మనా
తిష్ఠతి,సఏవ జీవన్ముక్తి సుఖంవిదేహకైవల్యసుఖంచ
విందతి."

అనగా లోకంబున రజస్వలయైన కన్య తనతలి దండ్రులను విడచి తన భర్తనే ఆశ్రయించి భర్త నెప్పుడును విడువక భర్తతో నేరమిం

పు చు క్రీ డిం పు చు ప తి యందే తృప్తినొంది పతికంటె అన్యులనుచూడక, యేవిషయములువినక, యేవస్తువును ముట్టక, యేసుఖముసు కోరక పతివ్రత యై తనభర్త నెట్లు సేవింపుచున్నదో అటువలెనే ము ముక్షుండైన జీవుండు దృఢవిరక్తిచే బ్రహ్మనిష్ఠం ప్రజ్ఞాబలంబున దేహేంద్రియంబుల నిగ్రహించి సచ్చిదానందబ్రహ్మమునే ఆశ్రయించి బ్రహ్మము తా ననే పట్టువదలక బ్రహ్మవిద్యాస్వరూపిణియైన పరాశక్తి గూడి రమింపుచు, క్రీడించుచు, విహరింపుచు, ఆనందింపుచు, బ్రహ్మనందసుధారసపానసంతుష్టుండై పతివ్రత తనభర్త నెప్పుడును విడువనట్లు మాయాక ల్పిత జగద్విషయంబుల నెప్పుడును కోరక దేహావసాన పర్యంతము బ్రహ్మనందరతిక్రీడా వినోదంబున నిత్య సంతుష్టుండై స్వదేహమందేవిదేహుకై వల్యసుఖంబనుభ వించునదియే ముక్తికాంతాపిలాసమని తాత్పర్యము.

"ఆరోపితనామరూపాదికం విహాయ సర్వ
తాధిష్ఠానభూత బ్రహ్మమాత్రదర్శనపరాః
పండితా ఇత్యర్థః, ఏవం బ్రహ్మతత్వ విజ్ఞా
నఖడ్గ నిర్భిన్నహృదయగంధ్యోకుషహాః
పునస్సాంసరిణం నసంభవతీత్యర్థః."

అనగా లోకంబున బ్రహ్మవేత్తలైన పండితులు బ్రహ్మవిద్యాప్రభావమువలన ఆరోపితనామరూపగుణవికారంబులు మాయాకల్పితంబులని, త్యజించి, సర్వనామరూపవస్తువులయందును అస్తిభాతిప్రియరూపమై అధిష్ఠానముగానున్న ఆత్మవస్తువును సచ్చిదానందపరబ్రహ్మముగ దర్శించి ఆపరబ్రహ్మమే తమ నిజరూపముగ నిశ్చయించి తనజన్మకర్మబీజాంకురమైన లింగదేహమును (అనగా బహు జన్మములనుండి దేహము తానని దృఢనిశ్చయమైన మనస్సంశయమును) బ్రహ్మము తాననెడి అనుభవజ్ఞానఖడ్గముచే ఖండించి అద్వయబ్రహ్మమయులై ప్రకాశించువారలు మరల పునర్జన్మమునొందరని తాత్పర్యము.

శ్లో. నిత్యంసదానందరసానుభూతిం।అభిన్నవృత్త్యాత్మని
కుర్వతాంసతాం। ఇంద్రియ్యలోకేనకిమబ్జయోనేః
కింవాహరేః కిమ్మశివస్యకార్యాత్ ॥

అనగా లోకంబున సత్పురుషులు యిట్లున్వయం బోధవలన తమ నిజరూపము బ్రహ్మస్వరూపముగా గ్రహించి అద్వయబ్రహ్మమయులై బ్రహ్మానందసుధారసం బనుభవింపుచు బ్రహ్మవిష్ణురుద్రేంద్రాదులు తమ

కు ప్రసన్నమైనను "బ్రహ్మసత్యం జగన్మిథ్య" యను న్యాయంబున సర్వలోకవిషయములను స్వప్నతుల్యము గానిశ్చయించినసర్వాధిష్ఠానపరిపూర్ణసచ్చిదానందస్వరూపంబగు ముక్తికాంతనే పొందుచుందురని తాత్పర్యము.

స్వస్వరూపస్వయంబోధసమాప్తం



శ్రీరస్తు.

శ్రీగురుభ్యోనమః

# ముక్తికాంతావిలాసము.

రెండవభాగము.

యక్షగానము.



ముక్తికాంతావిలాస మనగా లోకంబున బ్రహ్మవిద్యాపరిపూర్ణులైన రాజయోగులు వైరాగ్యబోధోపకరణులవలన బ్రహ్మానందసుఖ మనుభవించునది యని యర్థము.

అది యట్లంటే ఆదిపరబ్రహ్మమైనఆత్మయేపురుషుడున్నూ ఆపరబ్రహ్మశక్తియైన బుద్ధియేప్రకృతిన్నీ, ఆప్రకృతిపురుషసంయోగమే ముక్తికాంతాసంభోగ

మున్నా, అయినందున యీ దేహధారియైన జీవుండు ప్రకృతిపురుషవివేకమువలన తనమూలప్రకృతినివశపర చుకొని వైరాగ్యబోధోపరతులవలన తనఆత్మశక్తిలో రమించునదియే ముక్తికాంతాసంభోగమని చెప్పబడు చున్నది.

ప్రకృతి యనఁగా ఆవరణశక్తి, విక్షేపశక్తి, యిచ్ఛాశక్తి, జ్ఞానశక్తి, క్రియాశక్తి, అని పంచశక్తులై ప్రపంచమును సృజించునదిన్ని, పురుషుఁడనగా యాపంచశక్తులకున్నూ అధిష్ఠానమై ప్రకాశించువాడున్నూ అయినందున తానైన ఆత్మను మరపించునది ఆవరణశక్తిన్ని, దేహము తానని తోపించునది విక్షేపశక్తిన్ని, విషయములం దాశపుట్టించునది యిచ్ఛాశక్తిన్ని, విషయభోగముల యందు రుచిపుట్టించునది జ్ఞానశక్తిన్ని, విషయసుఖముల ననుభవింపజేయునది క్రియాశక్తిన్ని అగుటవలన సంకల్పవికల్పములు, జననమరణములు, జాగ్రన్నిద్రలు మొదలైన ప్రకృతిగుణంబులు బ్రహ్మమైన తనయం దారోపితములై అసంగచిద్రూపమైన ఆత్మకు స్వరూపవిస్మృతి కలుగుచున్నది. కాబట్టి ఆత్మయైనపురుషుండు వైరాగ్యబోధోపరతులచే తన విషయేచ్ఛాశక్తిని ఇష్టానిష్టేచ్ఛయందును, లోకజ్ఞాన

శక్తిని ఆత్మజ్ఞానమందును, విషయభోగశక్తిని ఆత్మాను భవమందును మరలించి ఆవరణవిక్షేపశక్తులను వశ పరచుకొని తనపరాశక్తియైన ఆత్మపత్నితో క్రీడించు నదియే ముక్తికాంతావిలాస మని తాత్పర్యము.

## వైరాగ్యబోధోపరతుల వివరణము.

వైరాగ్యమనగా యిలమీదం బ్రతుకేలవేల్పు లవరంబేలా! ధనంబేల చంచలగంధర్వ పురీవిడంబన ము-లైశ్వర్యంబులేలా! జగంబులబుట్టించు-తలంపునం బ్రకృతితోపొత్తె మదింబాసి-నిర్మలమై-వాఙ్మనసామి తంబగు పరబ్రహ్మంబునే కెందెదర.

అనగా జీవులకు యిచ్ఛయేజన్మము, జన్మమే దుఃఖము, దుఃఖమేనరకము, నరకమేమృత్యువు, ఆత్మ యేద్వైతము, ద్వైతమేసత్యము, సత్యమేజ్ఞానము, జ్ఞాన మేమోక్షము అయినందున జన్మముకంటె దుఃఖము న్నూ, మోక్షముకంటె సుఖమున్నూ యేలోకమునం దునులేదని నిశ్చయించి జీవన్ముక్తికొరకై పరితపించున దదే సంపూర్ణవైరాగ్యము.

బోధయనగా సీ॥ హరిరామనీవునా యంతరం గమునందు సాక్షివై యుండుటసత్యమైతే పాపము

బాసెను పాంచభౌతికమైన కాయంబుజలములఁగడుగ నేలా। విత్తక్షీణంబైన పీడను కర్మంబు—వేధించు వేల్పుకు వెరువనేలా। మమకారముడిగినా—మానును కర్మంబు—మోహంబు లుడిగిన మోక్షమిదియే। నిష్టయీరీతి నిజముగా నిలచినేని—మనసుదృఢమైతే చాలదా మాయగెలువ। భ్రాంతు లుడిగిన బ్రహ్మంబు బట్టబయలు। రామతారకదశరథరాజతనయ.

అనగా యీజగద్రూపుడైన పరబ్రహ్మమే ఆత్మారాముడై ప్రతిశరీరములోను ప్రకాశించుటవలన యీశరీరము పరమపవిత్రమైన దేవాలయమనిన్ని, దేహధారియైన జీవుండు పరబ్రహ్మమైన దేవుండనిన్ని శ్రుతిగురుస్వానుభవంబులచే స్పష్టమైనందున జీవుండైన తాను దేవుండని త్రికరణశుద్ధిగా నమ్మి నిశ్చయబుద్ధి గలిగి దేహము తానను జీవభ్రాంతిని విడిచియుండు నదియే స్వారాజ్యాభిషిక్తమైన సద్గురుబోధ యని తాత్పర్యము.

ఉపరతి యనగా సీ. వేదాంతమనుచు బ్రహ్మాదులెంచిన వెలుఁగు—నాదాంత సీమను నలరవెలుగు। సాధుజనానందసంపూర్ణమై వెలుగు—బోధకునిలయమై పొసగవెలుఁగు। ద్వాదశాబ్జమధ్యమందుదయించునావెలు

గు। సూక్ష్మనాళంబునజొచ్చి వెలుగు। శతకోటిభాస్కర ద్యుతులమించిన వెలుగు—మేరుపుశిఖరంబుమీఁది వెలుగు। అట్లు వెలిగెడి బ్రహ్మంబు నాత్మయనుచు—దెలియనేర్చినవాఁడె పో దేవుఁడనగ। మధురపురిపాల మునిజనహృదయలోల వేణుగోపాలభక్తసంత్రాణశీలా.

అనగా లోకంబున గురుదీక్షాపరుండైన జీవుండు "స్వస్వరూపే స్వయంజ్యోతి స్వస్వరూపే స్వయంరతి." అనునట్లు అఖండసచ్చిదానందపరబ్రహ్మమైన తనయాత్మ కోటిసూర్యప్రకాశమై అంతరబాహ్యములందు ప్రకాశించుచున్నదని అంతర్దృష్టిచే దర్శించి అంతటనుంచి తనయంతఃకరణమును ఆత్మయందు రమింపజేయునదే ఆత్మరతి యని చెప్పబడుచున్నది. ఇట్లు వైరాగ్యబోధోపరతులవలన ఆత్మసాక్షాత్కారపరుండైన జీవుండు తనబ్రహ్మవిద్యాప్రభావమును సద్గురురూపంబైన పరబ్రహ్మవిలాసమని స్వానుభవపూర్వకంబున నిట్లు ప్రకటించుచున్నాడు.

సావేరిరాగం - ఆటతాళం.

అదుగో సద్గురునివిలాసము। జీవయిదెంసుకే హృత్ప్రకాశము। అదుగో సద్గురుపాదపద్మము। హృదయవీథినిలువు[illegible] విశ్వమేఘము లేక బ్రహ్మయుత

నాదములంబై వెలుగుచున్నది ॥అదుగో॥ అండాండము
లకాధారమై యున్నది। పిండబ్రహ్మాండాతీతమైయున్నది।
[illegible] భావాభావ్యమునను। యఖండమై వెలిగేటి
జ్యోతి। దండిగాగనుగొన్నవారికి పండువెన్నెలపగిది
నున్నది ॥అదుగో॥ భావభావాతీతమైనది। జీవాకేవబ్ర
హ్మమైయున్నది। నీవారశూకాగ్రమందున నిలయమై
సమహాప్రకాశము దేవరవాక్యంబై వెలుంగుచు దివ్య
ముగగనుపట్టుచున్నది ॥అదుగో॥ బోధకునిలయమై
యున్నది। యేబాధలుగానవియున్నది। యీధరనుయా
గంటి పరశివస్వామి సద్గురుబోధనామది పాదుకొనిబ్ర
హ్మాండమంతయు పట్టపగలై వెలుగుచున్నది ॥అదుగో॥

అనగా లోకంబునబ్రహ్మజ్ఞాన సంపన్నులు పర
బ్రహ్మవిలాసంబైన బ్రహ్మానందము పరమగురునియు
పదేశంబువలన సిద్ధించునదిగాని అన్యథాలభించునది
కాదనిన్నీ। బ్రహ్మవిలాసము నెఱింగించిన సద్గురువేపర
బ్రహ్మ[illegible]న్నీ ఆపరబ్రహ్మవిలాసమే సద్గురువిలాస
మనిన్నీ। ఆసద్గురువిలాసమే ముక్తికాంతావిలాసమని
న్నీ। నిశ్చయించి సద్గురుపాదపద్మంబులు తమహృద
యపద్మంబుననిలిపి సదాభజింపుచు సద్గురుకటాక్ష
లబ్ధంబైన ఆత్మబోధను తమహృదయంబున రమింప

జేయుచు అఖండసచ్చిదానందస్వరూపంబైన పరబ్రహ్మమునుదర్శించి అండపిండబ్రహ్మాండములునిండి పండువెన్నెలవలె పట్టపగలై వెలుగుచున్న పరంజ్యోతియే పరమపదంబనిన్నీ, ఆపరమపదమై వ్యాప్తమే మోక్షసామ్రాజ్యమనిన్నీ, ఆ మోక్షసామ్రాజ్యమై భవమే ముక్తికాంతావిలాసమనిన్నీ, గ్రహించి యాముక్తికాంతానంభోగసుఖంబు నిట్లువర్ణించుచున్నారు.

రాగం—తాళం.

చక్కనిముక్తివధూటి-మది-జొక్కితి నిన్ననిబోటి।
చక్కరబొమ్మలమేటి-వేరెక్కడ నీకును సాటి॥చ॥
నిన్నుగాననివారు-నరులన్నను ధన్యులుగారు।నిన్నెరుగకయున్నారు-సంపన్నులె జగతిలో వారు॥చ॥
ఎందుకు నీదయరాదూ-వేరెందును నామదిబోదు।
సందియమేమియులేదు-నినుబొందక సౌఖ్యముగాదు॥
మానక నెప్పుడునేను-నీమరలున బడియున్నాను।
ఆనందాంబుధిలోను-వన్నికనైన దేల్పగనగునుచ॥
మానులబొందుమితారి-రిపునాయలదగ్గించక తారి।
జ్ఞానులచెంతనొయారీ-నను శంకరు జేయవెచేరి॥చ॥

అనగా లోకంబున అఖండమండలాధిపత్యంబైన రాజ్యలక్ష్మియైనను, అనేకకోటిసంచయంబులు

గల ధనలక్ష్మియైనను, మోక్షలక్ష్మికి దానిసరియైనందు
న బ్రహ్మవిద్యాధురంధరుండైన సర్వజ్ఞుండు "సామ్రా
జ్యంభోజ్యం స్వాత్మరాజ్యసుఖేరమే" అనునట్లుమోక్ష
సామ్రాజ్యమహాలక్ష్మియగు స్వాత్మపత్నితో సంభో
గించుచు ఓముక్తికాంతా! మోక్షసామ్రాజ్యవైభ
వంబైనను నీసంభోగమునకు సమా
నము గాదు గదా। రంభాది దేవకాంత
లైనను మాయకాంతలేగాని ముక్తికాంతలుగారు
గదా; అట్టిదేవకాంతలసంభోగమైనను తుచ్ఛభోగమే
గాని నిత్యభోగముకాదుగదా; బ్రహ్మాదిదేవతలకైన
ను నీసంభోగములభింపదుగదా; బ్రహ్మాదులకైనను
నీసంభోగమువలనగాని జన్మసాఫల్యముకానేరదుగదా;
ఇట్లు సర్వోత్కృష్టమైన నీసంభోగంబుగోరక లోకం
బున మానవులు రంభాసంభోగమును గోరుచుందురు.
ఎన్నికోట్లజన్మంబుల పుణ్యఫలంబుననో యీజన్మంబున
నాకు నీసంభోగంబు లభించినది. నీదర్శనమాత్రమునే
నామనంబునవనీతంబై కరిగిపోవుచున్నది. నీతోసంభో
గించినప్పు డీమనంబేమైయుండునో తెలియకున్నది. నీ
తోగలసి అన్యోన్యగాఢాలింగన చుంబనాదులచే రతి

క్రీడసల్పెడువాడు సాక్షాత్పరమేశ్వరుండుగాని జీవుండుగాడు. లోకంబున ముక్తికాంతతో రమించనివాడు నీతో సంభోగించని నపమన్మథుడైనను నపుంసకుడన బడుచున్నాడు. నామనం బెప్పుడునూ నీసంభోగంబునకే పరితపించుచున్నదిగాని తుచ్ఛభోగంబును గోరుటలేదు. లోకంబున మహాఋషులైన మానులందరును నీసంభోగమునకే నిరీక్షించుచుందురు. నీయందే మోహితులైయుందురు. నీవును నిస్సంగులనే వరింతువు. నిష్కాములనే రమింతువు. నీపరిపూర్ణకటాక్ష వీక్షణంబున ఆవరణవిక్షేపమాయనుతొలగించి నిత్యానందరతిక్రీడా వినోదంనబునను స్వారాజ్యాభిషిక్తుని జేయుచుందువని అనేకవిధంబుల ముక్తికాంతనుకొనియాడి, కొనియాడి బ్రహ్మజ్ఞానమహాత్వంబు నిట్లు ప్రకటించుచున్నాడు.

రాగం-తాళం.

జ్ఞానమా-ఆత్మజ్ఞానమా। తత్వజ్ఞానమా-దళి తాజ్ఞానమా॥ జ్ఞానమా-అజ్ఞానమనియెడి కానసముభస్మంబుసేయు। మహానలంబవుగదవెనీకు-సమానమాయితంబు॥ నాత్మజ్ఞానమా॥ పూనియజ్ఞానాంధకారము-లేనిదానిగ-జేయజాలిన। భానుదీప్తిగదవెలోకము-లో నినన్మానవులకాత్మ ॥జ్ఞానమా॥ మానుగనజ్ఞానమని

మొడిఁయేనుగనుపీనుగసేయు। ననూనబలకేసరివిగదవె
ధీనిధులకరయుంగనాత్మ ॥జ్ఞానమా॥ నీనిజస్థితిగాననేర్చి
న-వానిశంకరుజేయుదువుబహు। మానమహిమఁపున
ర్భవంబునులేని గతిబొందించితి ॥ఆత్మజ్ఞానమా। భక్తి
జ్ఞానమా॥జీవులకు॥

అనగా లోకంబునజీవులకు వ్యవహారజ్ఞానమని, పరమార్థజ్ఞానమని జ్ఞానము రెండువిధములు. అందువ్యవహారజ్ఞానమనగా దేహవర్ణాశ్రమ నామరూపంబులు ఆత్మయందారోపించుకొని దేహముతానని ప్రవర్తించునది ఆరోపితజ్ఞానమనిన్ని, పరమార్థజ్ఞానమనగా దేహవర్ణాశ్రమ నామరూపంబులు మాయాకల్పితంబులనిన్ని, దేహధారియైనజీవుండు అకల్పితస్వయంబ్రహ్మమైనదేవుండనిన్ని గ్రహించి బ్రహ్మముతానని ప్రవర్తించునది అధిష్ఠానజ్ఞానమనిన్ని చెప్పబడుచున్నది. అనేకజన్మములనుండి దేహముతానని వ్యవహరించెడు జీవుని యీజన్మమందుదేవుడుతాననియెరిగించి జీవన్ముక్తినొందించుటవలన జ్ఞానమే మోక్షస్వరూపమనిన్ని దేవతులకైనను దుర్లభమైనదనిన్ని, బ్రహ్మదులకైనను జ్ఞానములేక మోక్షముసిద్ధిచదనిన్ని, లోకంబుజ్ఞానమె సర్వోత్కృష్టముగా కొనియాడబడుచున్నది. జ్ఞాన

మన్ననూ, ఎరుకన్ననూ, తెలివన్ననూ, ప్రజ్ఞన్ననూ, ఆత్మన్ననూ, జీవుడన్ననూ, దేవుడన్ననూ, పర్యాయనామంబులుగాని బ్రహ్మవస్తువొక్కటియనియర్థము. పరబ్రహ్మమైన దేవుడొక్కడే తెలివిరూపమైనసర్వజీవులలోను నేనునేననిపలుకుచున్నాడనా! నిముషమాత్రములో దేవునిజూపించి ఒక్కయుక్తిలో ముక్తినిపొందించుచున్న ఓఆత్మజ్ఞానమా; లోకంబున జీవులకు దారాపుత్రసంసారము తనది యనే జ్ఞానారణ్యమును స్వరూపజ్ఞానదావానలంబున దహించుదానవున్నా, దేహము తానని భ్రమించెడు అజ్ఞానాంధకారమును ఆత్మజ్ఞానసూర్యోదయంబున నివర్తించుదానవున్నా, కామక్రోధాదిమదగజంబులను బ్రహ్మవిద్యాప్రబోధపరాక్రమసింహమువై సంహరించుదానవున్నా, అయినందున సర్వలోకములయందునూ ప్రజ్ఞాస్వరూపమైన నీవే ప్రకాశించుచున్నావు; సర్వకార్యములును నీప్రజవలననే నిర్వహింపబడుచున్నవి. సర్వభోగంబులును నీవలననే సిద్ధించుచున్నవి; గనుక సర్వోత్కృష్టమోక్షస్వరూపంబగు నీమహాత్త్వంబు బ్రహ్మాదులకైనను గ్రహింపరానిచో నరాధముడైన నేనెట్లు గ్రహింతును? ఇట్టి బ్రహ్మజ్ఞానప్రభావమువలన జ

న్మమృత్యు ప్రతిబంధవిముక్తుండనై శాశ్వతమోక్ష సామ్రాజ్యవైభవ మనుభవింపుచు అనాదిమూలాజ్ఞానప్రతిబంధము నిట్లు విడిపించుకొనుచున్నాడు.

రాగం—తాళం.

ఎంతపాపజాతివే-అజ్ఞానమా। నాచెంతవదలిపోవవే-యజ్ఞానమా॥ ఎంతతులువదానవే-యజ్ఞానమా। నీవంత మింకమానవే యజ్ఞానమా॥ ఇన్నాళ్ళదాకనో-యజ్ఞానమా। నే నిన్నెరుంగనైతినే-యజ్ఞానమా॥ఎంత॥ అల్లిబిల్లిశాయకే-యజ్ఞానమా। నీయిల్లుకాలిపోను-ఓయజ్ఞానమా॥ఎంత॥ కల్లలాడించకే-యజ్ఞానమా।నీతల్లికడుపుకాలనో-యజ్ఞానమా॥ఎంత॥ నీహాతం చేమాయెనే-యజ్ఞానమా। దుష్టాశలెందుబోయెనే యజ్ఞానమా॥ఎంత॥ నీటక్కులన్నిమానవే-యజ్ఞానమా। మాయచిక్కులన్ని తెలసెనేయజ్ఞానమా॥ఎంత॥ నాశంకలన్నిదీరెనే-యజ్ఞానమా। నేశంకరుండనైతినే యజ్ఞానమా॥ఎంత॥

అనగా లోకంబున జీవులకు అజ్ఞానమనగా తా నెవరో, తన స్వరూపమెట్టిదో, విచారింపని యవివేకముగాని జ్ఞానములేని జడమని యర్థముగాదు. గనుక నిత్యానిత్యవివేకమువలన నిత్యమైన బ్రహ్మము తన స్వరూపముగా గ్రహించిన జీవుండు జన్మకర్మ

మూలంబైన యవివేకమును పిశాచముగాను, అశ్రద్ధ పెనుభూతముగాను, నిశ్చయించి యీజన్మంబున తన లోనుండి తొలగించి యికముందు యీపాపగ్రహంబులు మరల తన్ను బొందకుండునట్లు మనోవాక్కాయ కర్మములచే నిట్లు మారణహోమము చేయుచున్నాడు. ఓయవివేకపిశాచమా ? వివేకవంతమైన మానుషజన్మ మెత్తియును, ద్విపాదపశువులనే దేహము తానని తోపించుచున్నావుగదా; యిట్టిపాపము నన్నికపొందించకుము.

ఓయశ్రద్ధాపెనుభూతమా ? వేదాంతశాస్త్రము చదివినను బ్రహ్మనిష్ఠ చేయనీయక విషయభోగములను మరగించి స్వస్వరూపమును మరపించుచున్నావుగదా. యిక నన్నిట్లు మోసముచేయకుము.

అనేకజన్మములనుండి అజ్ఞానమే జన్మకర్మమూలమని తెలియనీయక జననమరణసాగరంబున ముంచుచుంటివి. యిక నన్నట్లు ముంచకుము. ప్రజ్ఞానమే బ్రహ్మమనీ, అజ్ఞానమే మాయనీ, తెలిసినది గనుక ఆవరణవిక్షేపమాయచే నన్నిక చిక్కుల బెట్టకుము. లోకంబున పండితులనైనను కాంతాకనకములచే మోహింపజేసి మృత్యువుపాలు చేయుచున్నావు. న

న్నట్లు చేయక యింతటితో విడిచిపోమ్ము.

సర్వభోగసంతుష్టివలన సర్వవిషయాశాసముద్రము తరించితిని. గనుక యిచ్ఛా, జ్ఞాన, క్రియారూపంబున నన్ను విషయాశనుపొందింపక విడిచిపోమ్ము.

శ్రుతి గురుస్వానుభవబలంబున పుట్టని, చావని పరబ్రహ్మము నే నైతిని గనుక మాయాకార్యంబులైన సర్వసంశయములు మటుమాయమగుచున్నవి. బ్రహ్మమైన నాయందు జ్ఞానాజ్ఞానములు రెండును లేనందున మాయగాని మాయాకల్పితమైన జగత్తుగాని ఎప్పుడునూ లేదని తనపరిపూర్ణబ్రహ్మానందసంతుష్టియైన జీవన్ముక్తి స్థితి నిట్లు ప్రకటించుచున్నాడు.

రాగం——తాళం.

ఏమీకొదువామాకు-మరి-ఏమీచింతామాకు కామధేనువగుచుముక్తి। కదసియుండేమాకు ॥ఏమీకొదువా॥ సకలామ్నాయ - శాస్త్రములసారామబ్బెమాకు। త్రికరణాశుద్ధీగమేలు - తెరవుదొరకేమాకు॥ ఏమీకొదువా॥ చూపులందు తగులులేని-చూపుదొరికేమాకు। ఆపోజ్యోతిరూపామందు నలరగల్గెమాకు॥ ఏమీ॥ మాయావికృతూలెల్లమానె। మార్గమబ్బెమాకు। శ్రేయాములకుమూలమైనసిరి లాభించెమాకు॥

ఏమిా॥ ముక్తికాంతాభోగ్యమైన-యుక్తి దొరికేమాకు
వీరక్తిభక్తి భావమందు - శక్తిగలిగెమాకు ॥ఏమిా॥
శంకలేని ఆత్మజ్ఞానా-మింక దొరికేమాకు। శ్రీశంకర
సద్గురునిబోధ-సిద్ధిగలిగేమాకు ॥ఏమిాకొదువా॥

జీవన్ముక్తి యనగా గీ॥ తలపుచేతగలుగుతారక బ్రహ్మంబు। తలచిచూడ తానెతత్వమగును। తలపులోనెతలపు తన్నుతానెరిగిన విశ్వదాభిరామ వినుర వేమా॥ అన్నట్లు జీవుడైన తాను దేవుడుతానని తన్ను తానెరుగునదే ఒక్కయుక్తిలో ముక్తియైయున్నది. తానన గా తెలివిరూపమైన ఆత్మయున్నూ, సంకల్ప రూపమైన మనస్సున్నూ, రెండున్నూగలసి దేహాభావముచేత జీవుడనిన్నీ, ఆత్మభావముచేత దేవుడనిన్నీ, చెప్పబడుచున్నదిగాని, జీవుడు తానని, దేవుడు తానని మనస్సుకున్నూ, ఆత్మకున్నూ వేరువేరుగా చెప్పబడదు. గనుక తెలివిరూపమైనఆత్మ, తనతలపులో సాక్షియై వెలుగుచున్నదని తనతలపులోనిలిపి దేహముతాననే తలపునువదలి దేవుడుతాననితలపోయుచుండిన తనతలపులో వెలుగుచున్నతారకబ్రహ్మము తనకు ప్రసన్నమై తనతలపుతెలివిలోగలసి తారకబ్రహ్మముతానై ప్రకాశించునదియే ఆత్మసాయుజ్య మనబడుచున్నది.

యిట్లు బ్రహ్మసాక్షాత్కారపరుండైన వానికి ముక్తికాంతాసంభోగమును కామధేనువవలెనున్నా, బ్రహ్మవిద్యానందమును కల్పవృక్షమువలెనున్నా తన్నాశ్రయించి సర్వభోగసంతుష్టినొందించుటవలన నాకేచింతయు లేదనిన్నీ, నాకు సర్వవేదాంతరహస్యంబైన స్వారాజ్యాభిషేకముసిద్ధించినందున నామె మనోవాక్కాయములు త్రికరణశుద్ధిగా పరబ్రహ్మమునే భజింపుచున్నవనిన్నీ, నాయంతఃకరణము ఆత్మజ్యోతియందు నిలచి దహరాకాశమునే దర్శించుటవలన మాయాస్వరూపములందు చిక్కుబడనివిజ్ఞానదృష్టిలభించినదనిన్నీ, నాకు సర్వోత్కృష్టమైన మోక్షలక్ష్మి లభించుటవలన అష్టైశ్వర్యములయందును నిస్పృహత్వము గలిగినదనిన్నీ, నాయిచ్ఛా, జ్ఞాన, క్రియాశక్తి ముక్తికాంతాసంభోగమందు మరగియుండుటవలన విషయభోగములందు విరక్తిన్నీ, ఆత్మోపరతియందనురక్తిన్నీ గలుగుచున్నవనిన్నీ, నాకు సద్గురుకటాక్షంబువలన సర్వసంశయంబులు నిర్మూలంబై జన్మరహితంబైన విదేహకైవల్యము నాస్వదేహమందే సిద్ధించుటవలన జన్మసాఫల్యముంజెంది నిరంతరము గురుభజనంబు జేయుచు కృతార్థుడగుచున్నాడని తాత్పర్యము.

## రాగం—తాళం.

గురుచరణాంస్మరణామృతపానము। పరయోగులకిదిజీవనము॥ పరమహాంసగురుపాదసేవనము। పరమామృతసంజీవనము ॥గురు॥ మరణవ్యాధులకు-మహౌషధము। జననదుఃఖసంహారకము ॥గురు॥ దేహిదేహగుణ-మోహవిచ్ఛేదము। దివ్యజ్ఞానసుఖదాయకము ॥గురు॥ సాంఖ్యతారకమ-నస్కవిచారము। స్వస్వరూపసందర్శనము॥గురు। స్థూలసూక్ష్మతను-కారణలింగము। సునీలమధ్యమునసంగమము ॥గురు॥ సూర్యదాసగురు-సూత్రసంధానము। స్వప్రకాశమేకేవలము॥

శ్లో॥ నగురోరధికంసాధ్యం। నగురోరధికంతపః।
నగురోరధికంధ్యానం। నాస్తితత్త్వంగురోఃపరం॥

అన్నట్లు లోకంబునముముక్షువులకు సద్గురుబోధయే ముఖ్యసాధనమైనందున మోక్షాసక్తులైనసజ్జనులు సద్గురువును యిష్టదైవముగాప్రేమించి చతుర్విధశుశ్రూషలతో సేవించి సద్గురూపదిష్టంబైనబోధసూత్రమును గ్రహించి స్వారాజ్యాభిషిక్తులై మోక్షసామ్రాజ్యసుఖం బనుభవింతురుగాక! నిర్హేతుకజాయమాన

కటాక్షంబునసద్గురుప్రసాదంబు లభించుగాక! ఈముక్తికాంతావిలాసంబులోకంబున బ్రహ్మవిద్యావిలాసంబై ప్రబలించుగాక!

ముక్తికాంతావిలాసము

సంపూర్ణము.

ఓమ్

తత్సత్

బ్రహ్మైవాహమస్మి

గద్యః

ఇది శ్రీశంకరమంచి లక్ష్మీనృసింహ సద్గురు
కటాక్షలబ్ధంబగు బ్రహ్మవిద్యాప్రబో
ధంబును శ్రీగవరాజవంశపవిత్ర
లక్షణామాత్యపుత్ర సూర్యనా
రాయణశర్మణావిరచితంబు
ను, ముక్తికాంతావిలా
సంబనుమోక్షగ్రంథము
సంపూర్ణము.

# ప్రకటన.



1 జగన్నాటక విలాసము.

2 విదేహాకైవల్యము.

3 అనుభవదర్పణము.

4 సతీపతిహితోపదేశము.

5 పరమార్థబాలబోధ

6 ముక్తికాంతావిలాసమున్ను యీయారుగ్రంథముల వాక్యములున్ను లోకంబున ముముక్షువులకొరకు భగవదర్పణము చేయబడినవి. గనుక లోకంబున ధర్మాత్ములు యీమోక్షగ్రంథములను భగవత్ప్రీతిగా ముద్రించి ప్రకటింపగోరుచున్నాడను.

ఈగ్రంథములు వలయువారు

మ.రా.రా. శ్రీ ఎర్రిమిల్లి వెంకటబంగారాప్రుగారు.

పాశర్లపూడి. నగరంతాలూకా.

గోదావరిజిల్లా.

అని వ్రాయవలెను.

---

జగపతిముద్రాక్షరశాల—పెద్దాపురం.

www.mohanpublications.com

# మోహన్ పబ్లికేషన్స్‌లో లభించు
# పుస్తకముల పట్టిక
## (Book List)

ఆధ్యాత్మిక, జ్యోతిష, వాస్తు, ఆయుర్వేద, మంత్రశాస్త్రాది
అనేక విషయాలు తెలుసుకోండి...

ఫేస్‌బుక్ **మోహన్ పబ్లికేషన్స్** పేజ్ లైక్ చేయండి.

Like us to follow :



**MOHAN PUBLICATIONS**
Rajamahendravaram

0883 - 246 2565
903 246 2565

Mohan PUBLICATIONS

# మోహన్ పబ్లికేషన్స్,

అజంతా హోటల్ ఎదుట, కోటగుమ్మం, రాజమహేంద్రవరం - 533101.

WWW.MOHANPUBLICATIONS.COM

## మావద్ద లభించు గ్రంథములు

### 1. వ్రతకథలు - పూజలు

| | | |
|---|---|---|
| 1. | శ్రీ వినాయక వ్రతం | వెల రూ.10-00 |
| 2. | శ్రీ విఘ్నేశ్వరపూజా-పుణ్యాహవాచనం | 30-00 |
| 3. | శ్రీ విఘ్నేశ్వరపూజ (కాణిపాకక్షేత్రమాహాత్మ్యంతో) | 10-00 |
| 4. | సంకష్టహరచతుర్థి శ్రీమహాగణపతి వ్రతం | 30-00 |
| 5. | వరలక్ష్మీ వ్రతం | 10-00 |
| 6. | కేదారేశ్వర వ్రతం | 10-00 |
| 7. | త్రినాధ వ్రతం(కలర్) | 10-00 |
| 8. | త్రినాధవ్రతం(సాదా) | 5-00 |
| 9. | క్షీరాబ్ధి వ్రతం | 12-00 |
| 10. | మంగళ గౌరీవ్రతం | 10-00 |
| 11. | వైభవలక్ష్మీ వ్రతం ఫోటో యంత్రంతో | 25-00 |
| 12. | శ్రీలక్ష్మీ కుబేర వ్రతం (ఫోటో యంత్రంతో) | 25-00 |
| 13. | కనకమహాలక్ష్మీ వ్రతం (కామేశ్వరీపాటతో) | 25-00 |
| 14. | సంతోషీమాతా వ్రతం | 25-00 |
| 15. | ఏడు శనివారాల వ్రతం | 25-00 |
| 16. | సత్యనారాయణవ్రతం | 25-00 |
| 17. | శ్రీ సువర్చలాహనుమద్దీక్ష | 30-00 |
| 18. | శివదీక్ష | 10-00 |
| 19. | కాత్యాయనీ వ్రతం | 20-00 |
| 20. | సౌభాగ్య గౌరీవ్రతం | 20-00 |
| 21. | తిరుప్పావై (ధనుర్మాసవ్రతం) | 36-00 |
| 22. | స్త్రీల వ్రతకథలు | 36-00 |
| 23. | స్త్రీలవ్రతకథలుస్థూలాక్షరి (నేదునూరిగంగాధరరావుగారి) | 54-00 |
| 24. | పెళ్ళి పాటలు - స్త్రీలపాటలు (కామేశ్వరిపాటతో) | 36-00 |
| 25. | సర్వదేవతా పూజావిధానం | 25-00 |
| 26. | ఆరువ్రతాలు | 30-00 |
| 27. | రాహుకాలంలోదుర్గాదేవీపూజా | 10-00 |

ఈ ధరలు నికరముకాదు, ఎప్పటికప్పుడు మారుచుండవచ్చును.

| | | |
|---|---|---|
| 28. | తులసి నిత్యపూజ, తులసీఉపయోగాలు | 10-00 |
| 29. | శ్రీ చక్ర రహస్య విజ్ఞానమ్ | 36-00 |
| 30. | శ్రీచక్ర పూజావిధానం(పెద్దది) | 36-00 |
| 31. | లక్ష్మీ - గౌరీ నిత్యపూజ | 10-00 |
| 32. | శ్రీ సరస్వతీ నిత్యపూజ | 10-00 |
| 33. | శ్రీ దుర్గానిత్యపూజ | 10-00 |
| 34. | కాలభైరవ నిత్యపూజ | 10-00 |
| 35. | శివపూజ | 10-00 |
| 36. | వీరభద్ర పూజ | 10-00 |
| 37. | ఆంజనేయ నిత్యపూజ | 10-00 |
| 38. | నాగేంద్ర స్వామి పూజ | 10-00 |
| 39. | సుబ్రహ్మణ్య నిత్యపూజ | 10-00 |
| 40. | రామదేవుని కథ | 10-00 |
| 41. | శివదేవుని కథ | 10-00 |
| 42. | లక్ష్మీనరసింహపూజ | 10-00 |
| 43. | వేంకటేశ్వరపూజ | 10-00 |
| 44. | బ్రహ్మంగారి నిత్యపూజ | 10-00 |
| 45. | సూర్య నిత్యపూజ | 10-00 |
| 46. | నవగ్రహ నిత్యపూజ | 10-00 |
| 47. | రుక్మిణీ కల్యాణం | 25-00 |
| 48. | ఉమామహేశ్వర వ్రతం | 36-00 |
| 49. | శ్రీ కామేశ్వరీ వ్రతం | 36-00 |
| 50. | 16 సోమవారముల వ్రతము | 25-00 |
| 51. | పార్వతీకల్యాణం | 25-00 |
| 52. | సహస్రకమలవర్తి వ్రతము | 25-00 |
| 53. | పంచముఖ ఆంజనేయ పూజావిధానము | 36-00 |
| 54. | అష్టనాగపూజ | 36-00 |
| 55. | పూజలు ఎందుకుచేయాలి ? | 36-00 |
| 56. | ఏ దేవునికి ఏపుష్పాలతో పూజించాలి? | 36-00 |
| 57. | ఏ దేవునికి ఏప్రసాదం నైవేద్యం పెట్టాలి? | 36-00 |
| 58. | ఏదేవునికి ఏవిధముగాదీపారాధనచెయ్యాలి? | 36-00 |
| 59. | ఏదేవునికి ఎన్ని ప్రదక్షిణలుచేయాలి ? | 36-00 |
| 60. | హనుమద్ వ్రతం | 36-00 |
| 61. | పంచాయతన పూజ | 63-00 |
| 62. | 28 వ్రతములు | 120-00 |

